అర్థము:—శ్రీకృష్ణమూర్తి తనమూలమున, నేసర్పము యొక్క ప్రయాణముగలుగంగ, దూషితమైన యమునానదీ జలామృతమ్మును రసజ్ఞులను ద్రాగంగజేసెనో! యజ్ఞానంబున దూషితమైనట్టి యాసర్ప గ్రామణి కాళీయనామమ్ము నీభుజంగ ప్రయాతవృత్తమునఁ బొందుపఱుప నభ్యసింతుముగాక!!

ఆనందగోష్ఠి సుధీమణులారా!!

యమునానదినుండి భగవంతునిచే బహిష్కరింపఁబడిన కాలసర్పముయొక్క సంజ్ఞాపదంబు కాళియశబ్దముగాని దీర్ఘమధ్యమగు కాళీయ శబ్దము గాదనియు, అందువనే యాప్టినిఘంటువునందు హ్రస్వమధ్యము గా వ్రాయఁబడిన దనియుఁ గొందఱు ధీమంతులు ఘోషించుచుండెదరు. ఆధునికమైన పూర్వోక్తనిఘంటువునందుఁ జైశబ్దములోని ద్వితీయవర్ణము హ్రస్వముగా వ్రాసినంతమాత్రమున దీర్ఘరాయుక్తము గూడదనుట యాలోచింపఁగా నంత తృప్తికరమైన యుక్తిగాఁ గానిపింపదు. ఆ నిఘంటువునందును గొన్నిశబ్దములందు 'గొంత వ్యుత్పత్తిపక్షము సూచింపఁబడియు, నీశబ్దము నొద్దమాత్రమవ్యుత్పత్తిపక్షమే యంగీకరింపఁబడి నిశ్శబ్దమవలంబింపఁబడినది హ్రస్వమధ్యమగు కాళియశబ్దమే శిష్టప్రయోగమని వాదించువారలు సైతము శ్లో॥ "సంజ్ఞాసుధాతురూపాణి ప్రత్యయాశ్చతతఃపరే। కార్యాద్విద్యాదనూబంధమే తచ్ఛాస్త్రమునాదిషు" అను వచనమునం జేసియు "సంజ్ఞాసుధాతు రూపాణీతితు, అనాది శిష్టప్రయోగసాధనే ఉపాయమాత్రమ్, నత్వాధుని కక్రియమాణ సంజ్ఞాను గ్రాహకమితిభావః॥ అనెడి ఋౌక్ సూత్రస్థమైన భాష్యప్రదీ పోద్ద్యోతమునం జేసియు, నాశబ్దమును నించుకంతైనను వ్యుత్పత్తి పక్షంబునకు వశవర్తిం జేసి కాళీయశబ్దము శాస్త్రవాసనా దూరవర్తియని ఋజువుచేసినచో నపుడు "సమానేచార్థే శాస్త్రాన్వితోఽ శాస్త్రాన్వితస్య నివర్తకోభవతి। తద్యథా, దేవదత్తశబ్దో దేవదిణ్ణశబ్దాం నివర్త